# అమృత వాక్కులు: స్వామి వివేకానంద

*పరిపూర్ణం ఎన్నడూ అపరిపూర్ణం కాదు. *మంచి అనేది, సత్యానికి సమీపం లో వుంటుంది. కాని అది ఇంకా సత్యం కాలేదు. *సముద్రాన్ని గమనించు,'అలను' కాదు. కేవలం ఓర్చుకొని వుండవద్దు. అనా సక్తుడవై వుండు. *నరకం ద్వారానైనా సరే సత్యాన్ని చేర సాహసించు. *పరనింద అంతా మనలను నిజానికి నిందితులను చేస్తుంది. *మనలో లేనిదాన్ని మనం బైటచూడలేం. *జీవులన్నిటిలోను, మానవుడు ఉత్త మోత్తముడు. *మహోన్నత వేదాంతం అంటే, పరతత్త్వమైనదాన్ని గూర్చి చెప్పే తత్త్వశాస్త్రం. *ప్రకృతి, ప్రారబ్ధం అని మనం చెప్పేది కేవలం ఈశ్వరేచ్ఛ. *జపమంటె దివ్యనామోచ్చారణ, భక్తుడు జపంద్వారా అనంతత్వానికి కెగయుచున్నాడు. *కర్మాచరణ చిత్తశుద్ధిని కల్గిస్తుంది. విద్య (ఆధ్యాత్మిక జ్ఞానం)ను ప్రాప్తింప జేస్తుంది.

*మతం (ధర్మం) పాడి ఆవు వంటిది. ఇది అనేక తన్నులు తన్నినా లెక్కచేయ వద్దు. అది చాలా పాలు యిస్తుంది. *భక్తి మార్గం సహజమూ, సంతోష దాయకమూను. *మహోన్నతమైన్నతమైన ఆదర్శం ఎన్నుకొని, ఆ ప్రకారం నీ జీవితాన్ని మలచుకో. *వేదాలు బ్రహ్మాన్ని దర్శింపజేయలేవు. నువ్వు బ్రహ్మమే అయివున్నావు. *అనుభవమే గురువు. *వైరాగ్యమంటే, కోరికలు తేనె పూసిన కత్తులవంటివని తెలిసికోవటం. *గ్రంథపఠనం వలన వేదాంతం లభ్యం కాదు. *ఈ ప్రపంచం మనం క్రీడించే క్రీడాంగణం వంటిది. *మన జీవితం ఒక శాశ్వతమైన సెలవు దినం. *న్యాయబద్ధమైన ' 'ధార్మికఆగ్రహ'మనేది లేదు. *ప్రత్యేకమైన విధానాలలో ఆగిపోక ఏకమైవున్న మూలసిద్ధాంతం వద్దకు పో. *మానవుడు ముక్తిని పొందగలిగేది ఈ

లోకంలో మాత్రమే.  *నువ్వు ఇదివరకే ముక్తుడవుగా నుండ నిచో నీకు ముక్తిని యివ్వగలది ఏదీ లేదు. *నువ్వు బలహీనుడవని తలచటం మహాపాపం. *మానవుడికి ఆతడి దివ్యత్వం బోధించు. *ఏ కర్మాచరణా నీకు ముక్తిని యివ్వలేదు. కేవలం జ్ఞానమే నిన్ను విముక్తుణ్ణి చేస్తుంది. *వేదాంతంపై, భగవద్గీత ఉత్కృష్టమైన ప్రమాణగ్రంథం *అందరికి ఏ ఒక్క మార్గం సరిపోదు. *మతమంతా (ధర్మమంతా)విచక్షణను (యుక్తిని) దాటిపోవటమే. కాని ఆ స్థితి పొందటానికి యుక్తియే మార్గదర్శి. *స్వభావం మంచుగడ్డ వంటిది. విచక్షణ నీరు, ఉత్తేజం ఆవిరియొక్క  సూక్ష్మతమ రూపం.

*మతం (ధర్మం) యుక్తికి అతీతమూ, అతీంద్రియమూ. *శ్రద్ధ నమ్మకం కాదు. అది పరవస్తువును గూర్చిన విషయ గ్రహణ ప్రకాశం. *మాటలలో నీ శక్తిని వ్యయపరచవద్దు.

నిశ్శబ్దంగా ధ్యానం చేయి. *ఆధ్యాత్మిక విద్యుదుత్పాదన యంత్రంగా తయారవు. *నీ సంపద దేవుణ్ణి చెందినది కాబట్టి దాన్ని సంరక్షకుడిలా పరిరక్షించు. *ప్రతి అల వెనుక, సముద్రమంతా ఆధారంగా నిలిచివున్నది. *మతం నీకేదో కొత్తది కల్పించటం లేదు, నీ ఆటంకాలను తొలగించి, నీ ఆత్మను నువ్వు దర్శించే అవకాశం కలిగిస్తుంది. *'విచార' మనేది దాట శక్యంగాని అవరోధం. *నీకు ఆధ్యాత్మికానుభూతిని కొనితెచ్చే వాహనం గురువు. *ఇష్టదేవత అంటె, ఆయా ఉపాసకుని యొక్క ప్రత్యేకమైన ఆదర్శం; దానిని వివరించే బాహ్య శబ్దమే మంత్రం. *పనులన్నింటిని యజ్ఞంవలె, భగవదర్పణ గావించు. *తామరాకులా సంసారంలో వుండు. కాని సంసారివి కావద్దు. *మనలో లేనిచో, బైట చెడునెలా చూడగలం? *ప్రతి పురుషుడిలోను, స్త్రీలోను, చిన్నబిడ్డలోను, దేవుణ్ణి మాత్రమే గాంచు. *సృష్టికర్త సృష్టించినదాన్ని కాక సృష్టి

కర్తలోని విజ్ఞానాన్ని అన్వేషించు. నువ్వు మామిడి పండ్లను తిను; ఇతరులను ఆ చెట్టునుగూర్చి తగవులాడుకొననివ్వు. *ఊహను, ఊహతో తర్కించటం, తగవును తెస్తుంది. *విషయ పరంపరలను ఆలోచించేది ధ్యానం, ఒక్క విషయాన్ని గూర్చి చేసేది ఏకాగ్రత. *కేవలం గానుగెద్దులా నిష్ప్రయోజనంగా, పొద్దస్తమానం పనిచేయవద్దు. *మాయను, స్వాధీనంలో వుంచుకొన్న పరమాత్మ ఈశ్వరుడు! మాయ యొక్క ఆధీనంలో  వున్న పరమాత్మ జీవుడు. *శరీర భ్రాంతి వదలిపెట్టు; సాధ్య మైనంతవరకు దాని ఉనికిని మరచిపో. *ఏదీ కోరనివారే ప్రకృతిని జయించిన వారు. *మనం బద్ధులమైవున్నా మనుకొనునది కలగనటమే. మేల్కొని కల కరగి పోనివ్వు. *దానము చేసే అవకాశం దక్కటం మన భాగ్యం. అలా తెలిసికొనటం వలననే మనం పురోభివృద్ధి చెందుతూన్నాం.

*ఏదో అపరిపూర్ణత వున్నదని తలంచటం వలననే, అపరిపూర్ణత సృష్టింపబడు తోంది. *నీ పురోభివృద్ధికోసం, ఈ ప్రపంచం అనేఒక వ్యాయామశాలను కల్పించినందుకు, భగవంతుణ్ణి కొనియాడు. నువ్వు ఈ ప్రపంచానికి సహాయం చేయగలనని ఎన్నడూ తలచవద్దు. *దుష్ట తలపు, పాపాచరణ వంటిది. *సత్యానికి రాజీ పడటం లేదు. *ఈ లోకాన్ని యే యిద్దరూ ఒకేమాదిరిగా చూడరు. *చిత్తశుద్ధిని సాధించు; ఇదే మతసారం. *ఇతరులను పాపి అనటంకంటె, నువ్వు చేయగలిగిన ఘోరపాప మింకొకటి లేదు. మానవుణ్ణి కృష్ణుడు బుద్ధుడు క్రీస్తుగా ఆరాధించటం సర్వోత్కృష్టమైన ఆరాధన. *స్వర్గ సుఖాల నెన్నడూ కోరవద్దు. అది నికృష్టమైన భ్రాంతి, *మానవుడు, పశువు, ఆహారము, కృషి మొదలైన వాటన్నింటితో భగవంతుణ్ణి జోడించు.

*లోపాలను బట్టి మానవుణ్ణి నిర్ణయించ వద్దు. *మానవ ప్రవృత్తిలోని గొప్పతనాన్ని ఎన్నడూ మరువవద్దు. *బలహీనతను గూర్చి ఎన్నడూ తల పోయవద్దు. *మానవాకృతి మహోన్నతం; మానవుడు మహోత్కృష్టుడు. *పరిపూర్ణమైన నిస్సహాయ స్థితే, మహోన్నత స్థితి. *సిద్ధ పురుషుని శరీరం స్వాభావికంగా మంచినే చేస్తుంది. *ఆత్మ విశ్వాసం కోల్పోకు నీకీ లోకంలో అసాధ్యమేదీ లేదు. *మతమంతా (ధర్మ) మనలోనే వున్నది. గ్రంథాలుగాని, గురువులు గాని, దాన్ని కనుగొనటానికి సహాయపడటం కన్నా, మరేమీ చేయలేరు. వారు లేకపోయినా మనలోనే సత్యాన్ని దర్శించగలం. *భగవంతుడికి మన మేమీ సమర్పింపలేం. సర్వం మనకాయన ప్రసాదిస్తూన్నాడు. *గులాబి పువ్వు తన పరిమళాన్ని గుబాళించేట్లు, నువ్వు దానం చేయి. ఇస్తూన్నాననేస్పృహ లేకయే యివ్వటం దాని ధర్మం.

*అద్వైతాన్ని తాత్కాలికంగా మరచి, ద్వైతివిగా మార ప్రయత్నించు. మరల నీ యిచ్ఛ వచ్చినప్పుడు పాటింపగలిగి వుండు. *ఆత్మ గ్రంథం తెరచుకొనేటంత వరకు బాహ్య గ్రంథాలు మనకు నిరుపయోగాలు. *ఉత్తమమైన దాన్ని ఉత్తమమైనదే మెచ్చుకోగలదు. దేవుడే దేవుని తెలుసుకోగలడు. *మానవుణ్ణి అధ్యయనం చేయి. అతడే సజీవ కావ్యం. *నీ సుకృత, దుష్కృతాలను ఉమ్మివలె త్యజించు. మరల వాని నెన్నడూ తలచకు. *తన సర్వ ప్రయత్నాలు త్యజించిన వ్యక్తికి దైవం సాయపడుతుంది. *విచక్షణకంటే భావావేశం ఎంతో గొప్పది. కాని భావావేశం విచక్షణకు విరుద్ధంగా వుండకూడదు. *నువ్వు దుఃఖదళితుడననే మరచి, ప్రతి కష్టాన్ని భరించు. *చండశాసనమైన 'విధి' అనే భావన కాలకూట విషం వంటిది. అది ఈ ప్రపంచాన్ని నశింపజేస్తున్నది.

*జనసందోహం, వేదాంతాన్ని ఆచరణలోకి తేవటాన్ని ఈ ఆధునికి యుగంచూచి తీరాలి. ఈ మార్పు స్త్రీల వలననే రావలసివున్నది. *ఇతరులు కూడా 'తానే' కాబట్టి మానవుడు అన్యులను ప్రేమించాలి. *మతం (ధర్మం) ముఖ్యంగా అనుభవంలోనే యిమిడివున్నది. సిద్ధాంతాలు మతంకాదు. విధానాలు మాత్రమే. *ప్రాచీన మూఢ విశ్వాసాలను అంటిపెట్టుకోకు, నవ్య సత్యాల కోసం సంసిద్ధుడవై వుండు. *స్వతసిద్ధంగా ప్రతివాడు పరిపూర్ణుడే. ప్రవక్తలు ఈ పరిపూర్ణత్వాన్ని అభివ్యక్త మొనర్చారు కాని అది మనలో అంతర్గతమై వున్నది. *నువ్వు ఏ మార్గాన చేరగలవో, ఆ మార్గం ద్వారా భగవంతుని చేరుకో. మామూలుగా వచ్చిచేరు. అంతేకాని  నువ్వు రావటంలో యితరుల నెవ్వరిని పక్కకు నెట్టబోకు. *మానవజాతి యొక్క గడచిపోయిన జీవితాన్ని

మాత్రమేకాక, ఆ జాతి యొక్క భవిష్యత్ జీవితాన్నంతా, మనం జీవించాలని వేదాంతం చెబుతోంది. మొదటిదాన్ని అనుభవించినవాడు విద్యావంతుడు, రెండవవాడు నిత్యముక్తుడైన జీవన్ముక్తుడు. *మతబోధలన్నీ ఎల్లప్పుడు నిర్మాణాత్మకంగా వుండాలేగాని విధ్వంసాత్మకాలు కాకూడదు. *అగాధత్వంతో కూడిన విశాలత్వాన్ని సాధించు. కాని అగాధత్వాన్ని విస్మరించి కాదు. *''విచక్షణ' కన్న ' భావన' అతి శీఘ్రంగా నిన్నుఉన్నతికి గొనిపోతుంది *ఏసుక్రీస్తు పన్నెండుమంది జాలరులను తన వెనుక వదలివెళ్లాడు. అయినా ఆ కొద్దిమంది రోమను సామ్రాజ్యాన్ని ఎగురుగొట్టి వేశారు. *ప్రయత్నం చేయనివాడికంటే, పాటుపడేవాడు ఉత్తముడు. *భగవంతుడికై లేచి నిలబడు. ప్రపంచ మేమైనా కానివ్వు. రాజీపడవద్దు. *జడపదార్థం యొక్క బంధంనుండి, విముక్తుని చేసే కర్మ నైతికకర్మ. బద్ధుణ్ణి చేసేది నైతిక కర్మ కాదు. *మనం బయటికి వచ్చి తీరాలి. ముక్తి,

మనం చేరవలసిన ఒక గమ్యం.*భౌతిక దుఃఖం యొక్క పరిణామమే భౌతికానందం. *ఈ లోకాన్ని బాగాను, ఆనందంగాను చేయాలని ఎన్నడూ తలంచవద్దు. *మానవ ఆనందమంతా, మతంలోని భాగమే. *“నిర్మల హృదయులు ధన్యాత్ములువారు భగవంతుణ్ణి దర్శిస్తారు. అన్ని గ్రంథాలు, అందరు ప్రవక్తలు నశించినా ఈ ఒక్క వాక్యమే మానవజాతిని కాపాడుతుంది. *ఈ లోకంలో ‘ అనేకాన్ని' దర్శించటం అందరు చేస్తున్న మహాపాపం. అందరిని 'ఆత్మ'గా దర్శించి ఎల్లరను ప్రేమించు. వేరువేరు అనే భావాన్ని రూపుమాపు. *'ఉపకారాన్ని' గూర్చిన భావనలన్నింటి సమ్మేళనం భగవంతుడు. *శరీరం ఉండి మనం దానిని గమనిస్తూన్నంతవరకు, భగవత్సాక్షాత్కారం మనకు కలుగనట్లే, అది అంతరించినప్పుడు, చిన్న సుడిగుండం నిలిచి వుంటుందా? *సహాయంకోసం విలపించు. నీకు అదిలభిస్తుంది. చివరకు నీకు తెలిసేది ఏమంటే,

సహాయం కావాలి అని అలమటించినవాడూ, సహాయం చేసినవాడూ యిద్దరు అదృశ్యులై, ఆట అంతరించి, 'ఆత్మ' మాత్రమే నిలిచివుంటుంది. *ఎల్లవేళల భగవంతుని తలంచు. తలంపు నిన్ను పరిశుద్ధుణ్ణి చేస్తుంది. *ఇతరులకోసం చేసిన ఏ స్వల్పకార్యమైనా, అంతర్గతమైన శక్తిని మేల్కొల్పి క్రమంగా హృదయాన్ని సింహసదృశమైన బలంతో నింపివేస్తుంది. *జీవితం క్షణభంగురం. భౌతిక సంపదలు నశ్వరాలు. పరులకై పాటుపడినవారే నిజానికి జీవించినవారు. మిగిలినవారు బ్రతికివుండీ చచ్చినవారితో సమానమే. *సంపదలుగాని, పేరు ప్రతిష్ఠలుగాని, గౌరవ మర్యాదలుగాని, పాండిత్యంగాని పనిచేయవు. ప్రేమ ఒక్కటే నిలిచివుంటుంది. కష్టాలు అనే అడ్డుగోడలను చీల్చుకొని పోగలిగేది శీలమే (మంచి నడవడికయే) .*అసత్యమైన ప్రతిదాన్ని చూచి జాగ్రత్తపడు. సత్యాన్నే అంటిపట్టుకొని వుండు.ఆలస్యమైనా మనం తప్పక జయించి తీరుతాం.

*శారీరకంగా గాని, మానసికంగా గాని, నైతికంగా గాని లేక ఆధ్యాత్మికంగా గాని బలహీనుడవు కాబోకు. *మన ప్రార్థనలలో, భగవంతుడు మనకు తండ్రియని చెప్పుచూ మన నిత్య జీవితంలో యితరులను మన సోదరులుగా చూడనిచో ఆ ప్రార్థనలవల్ల ప్రయోజనం ఏమున్నది? *ఈ లోకంలో ఎల్లప్పుడూ యిచ్చేవాని (దాత) స్థితిలోనే వుండు. సాయంచేయి. *సేవ చేయి. ఏ స్వల్పమైనా యివ్వు, కాని బేరమాడవద్దు. *స్వార్థచింతన లేనప్పుడే మనం ఘన కార్యాలు సాధిస్తాం. మన ప్రభావం యితరులపై పడుతుంది. *'విముక్తి' అనే భావన ఎల్లప్పుడు ఎవరియందు జాగృతమై వున్నదో, వాడే ముక్తిని పొందుతాడు. *పాపభూయిష్టమైన 'భయం'నుండే ప్రపంచమందున్న వ్యతిరేకభావాలు, తలంపులు, ఉత్పన్నమవుతున్నవి. అందువలన 'అభీః' (భయపడకు), 'అభీః'(భయపడకు) అని నేను ఉద్ఘాటిస్తున్నాను.

*తినటంలోను, వస్త్రధారణలో గాని, పరుండటంలోగాని, ఆటలలో గాని, పాటలలోగాని, సుఖంలోగాని దుఃఖంలోగాని అన్నివేళలలోను మహోన్నతమైన నైతిక బలాన్ని ప్రకటించు. *నా కార్యాచరణ విధానం నిర్మాణాత్మకమే గాని, వినాశంగాదు. *జీవారాధకుడే నిజానికి శివారాధకుడు. నిజంగా సత్యదర్శనం చేయదలచినవాడు సుఖాన్ని అంటిపెట్టుకోనే పెట్టుకోరాదు... త్యాగం అవసరం. *శాశ్వత ధర్మం (న్యాయసూత్రం) స్వార్థత్యాగంగాని, స్వార్థపరత్వంగాదు. *మనకు చిన్న చిన్న అలలవలె కన్పిస్తూనా్న మహాసముద్రం మనకు ఆధారంగా వున్నది. మనం దానికి అభిన్నం. ఏ అలగాని తనంతట తాను వుండలేదు. *ఉత్తమ ఆధ్యాత్మిక సత్యాలు, నువ్వు

ఆరంభంలోనే బోధించనేరవు. *జనసమూహాలు లెక్కలోనికి రావు. ఒక గుంపు ఒక శతాబ్దంలో చేయగలిగిన దాని కంటే నిండు హృదయులు, నిజాయితీ పరులు, శక్తిపూరితులు అయిన కొద్దిమంది మాత్రమే ఒక సం||లో ఎక్కువ పని చేయగలరు.

*మందీ మార్బలం గాని, అధికారంగాని, సంపద గాని, పాండిత్యం గాని వాగ్దాటిగాని మరేమైన గాని నిలచివుండవు. కాని నిలచేది పవిత్రత,ఆచరణ ఒక్క మాటలో అనుభూతి, సాక్షాత్కారం. *వెయ్యిసార్లు పడిపోయినా శీల నిర్మాణము గావించుకోవాలి.

*జడంలో చైతన్యాన్ని క్రమంగా అధ్యయనం చేయటమే, నాగరికత యొక్క చరిత్ర,

*కార్యసిద్ధికి కీలకమంతా దీన్లోనే - అంటేసాధ్యంలోనే చూపవలసినంత శ్రద్ధ; సాధనావిధానాలపట్ల కూడ చూపటంలోనే - వుంది.

*మనం దేనికి అర్హులమో అదే మనకులభిస్తుంది. *కేంద్రం ఒకేచోటవుండి, పరిధి ఎక్కడాలేని ఒక అనంతవృత్తం మానవుడు. కేంద్రం సర్వత్రాకలిగివుండి, పరిధి ఎక్కడ డా లేని ఒక అనంతవృత్తం భగవంతుడు. *మతం విధి విధానాలలోను, వాద ప్రతి వాదాలలోను లేదు. అదిఆచరణ అనుభవం, అది సాక్షాత్కారం. *సత్యం ఏ సంఘానికి - ప్రాచీనంగాని, అర్వాచీనంగాని తల ఒగ్గదు. సంఘమే సత్యానికి తల బగ్గాలి, లేదా నశించాలి. ప్రపంచ చరిత్రలో ఎక్కడ చూచినా, మహాత్ముల జీవితాలలో - స్త్రీలైనా, పురుషలైనా - వారిలో వున్న చోదనాత్మక శక్తి ఒక దానికన్న మరొకటి అధికంగా వున్నదంటే, అది వారి ఆత్మవిశ్వాసంలోని శక్తి.

*ఈ లోకంలో సత్సాంగత్యం కంటే పవిత్రమైనది వేరొకటి లేదు.

*ప్రతి జీవి, పరాత్పరుడి దేవాలయం. *భగవంతుడు వివరణకు, వర్ణనకు అతీతమైన ప్రేమామృతసారం, అనుభవైకవేద్యం. ఎన్నడూ నిర్వచించబడలేదు. *సాహసోపేతుడవుగాను, న్యాయవర్తనుడవుగాను వుండు. అలావుండి భక్తితో మార్గం అనుసరించు, భగవంతుణ్ణి చేరి తీరుతావు.

అమృత వాక్కులు: స్వామి వివేకానంద